

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి.మహానుభావులైన సాధకులు, జిజ్ఞాసువులు జ్ఞాన ప్రచారార్ధం తాము సేకరించిన విలువైన గ్రంధాలను స్క్రిబ్డ్ వెబ్ సైట్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ సైట్(https://archive.org), గూగుల్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) స్క్రిబ్డ్ వారి వెబ్ సైట్: http://www.scribd.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు:sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో సాధకులు,జిజ్ఞాసువులు స్క్రిబ్డ్ వెబ్ సైట్ ద్వారా అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు*

స్క్రిబ్డ్ వారి వెబ్ సైట్:

http://www.scribd.com



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఓజసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# అగ్ని పురాణము

ఈ అగ్నిపురాణమును గూర్చియు, దీని విశిష్టతను గురించియు ఇదే పురాణములో 271వ అధ్యాయములో ఇట్లు వివరింపబడినది.

శ్లో॥ అగ్నిరూపేణ దేవాదే ర్మఖం విష్ణుః పరాగతిః
ఆగ్నేయస్య పురాణస్య వక్తా శ్రోతా జనార్దనః
తస్మా త్పురాణ మాగ్నేయం సర్వవేదమయం జగత్
సర్వవిద్యామయం పుణ్యం సర్వజ్ఞానమయం పరం
సర్వాత్మహరిరూపం హి పఠతాం శృణ్వతాం నృణాం
విద్యార్థినాం చ విద్యాదం అర్థినాం శ్రీధనప్రదం
సర్వేప్సూనాం సర్వదం తు ముక్తిదం ముక్తికామినాం
పాపఘ్నం పాపకర్తౄణా మాగ్నేయం హి పురాణకమ్.

అనగా శ్రీమహావిష్ణువు అగ్నిరూపముతో దేవదానవ మానవాదులకు ముఖస్థానీయుడై పోషణ చేయుచున్నాడు. అందుచే అగ్నిచే చెప్పబడిన ఈ పురాణమును చెప్పువాడును, వినువాడును గూడ జనార్దనుడే. ఆ హేతువు చేత ఈ పురాణము సమస్తమైన వేదమయ జగత్తుగా గ్రహించవలెను. సర్వవిద్యలు, సర్వవిషయ జ్ఞానము, దీనివలన పొంద వచ్చును. సర్వాత్ముడైన శ్రీహరి విశ్వరూపము దీనిలో చూడవచ్చును. విద్యార్థులకు విద్యలను, కోరినవారికి ధనాది సంపదలను, ముక్తిని గోరువారికి ముక్తిని, అన్నింటిని గోరువారి కన్నింటిని ఇచ్చి సర్వపాపములను బోగొట్టి, మహాపుణ్యము నిచ్చును అని యర్థము. ఈ పురాణమును ఒక విజ్ఞాన సర్వస్వమని చెప్పవచ్చును. లౌకికాలౌకిక విషయము లెన్నో దీనిలో వివరింపబడినవి. ఈ పురాణము ఒక మంత్రశాస్త్రమని కూడ చెప్పుచుందురు. వసిష్ఠ మహామునికి అగ్నిదేవుడు వినిపించిన పురాణమును, నైమిశారణ్యమున సూతుడు శౌనకాది మునులకువినిపించెను.అగ్నిదేవుడు చెప్పిన పురాణము గావున అగ్ని (ఆగ్నేయ) పురాణమని ప్రసిద్ధి కెక్కెను.

## మహాభారతకథ

"శ్రీకృష్ణుడు భారత యుద్ధములో పాండవుల పక్షమున నిలిచినాడని చెప్పితివిగదా, అగ్నిదేవా!ఆ పాండవు లెవరు?వారి కథను వినిపింపు"మనగా, అగ్నిదేవుడు వశిష్ఠున కిట్లు చెప్పెను."బ్రహ్మ మానసపుత్రుడు అత్రి. అతని కొడుకు చంద్రుడు. అతని వంశమున భరతుడు పుట్టెను. వాని వంశములో శంతను డనువానికి భీష్ముడు పుట్టెను. అతడు పెండ్లి చెసికొనలేదు.

శంతనునికి సత్యవతియందు చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు అనువారు గూడ పుట్టిరి. చిత్రాంగదుడు ఒక గంధర్వునితో పోరాడి మరణించెను. భీష్ముడు విచిత్ర వీర్యునికి కాశిరాజు కూతుండ్రు అంబిక అంబాలిక అనువారిని దెచ్చి పెండ్లిచేసెను. విచిత్రవీర్యుడు క్షయరోగముతో మరణించగా, సత్యవతి ఆదేశముమీద అంబిక వ్యాసుని వలన ధృతరాష్ట్రుని, అంబాలిక పాండురాజును గనెను. ధృతరాష్ట్రునికి గాంధారియందు
దుర్యోధనాదులు వందమంది కొడుకులు పుట్టిరి. పాండురాజునకు కుంతి, మాద్రి అని ఇద్దరు భార్యలు. అతడు శాపగ్రస్తుడు కాగా, అతని అనుమతితో కుంతి యమధర్మరాజు ప్రసాదమున ధర్మరాజును, వాయుప్రసాదమున భీముని, ఇంద్రప్రసాదమున అర్జునుని గనెను. మాద్రి అశ్వినుల అనుగ్రహమున నకుల సహదేవులను గనెను. పాండురాజు మాద్రిని కలియబోయి మరణించెను.కర్ణుడు, కుంతికి పెండ్లికాక ముందే సూర్యునివలన పుట్టినవాడు. అతడు దుర్యోధనుడు నాశ్రయించెను. కురుపాండవులు కృపద్రోణుల వద్ద సర్వశస్త్రాస్త్ర విద్యలు నేర్చుకొనిరి. దైవయోగము వలన కురుపాండవుల మధ్య వైరము గలిగెను. దుర్యోధనుడు లక్కయింటిలో బెట్టి పాండవులను దహించెను. పాండవులు తప్పించుకొని ఏకచక్రపురము చేరిరి. మునివేషములతో నుండి బకాసురుని జంపి, పాంచాలదేశమునకు బోయిరి. అక్కడ అర్జునుడు, మత్స్యయంత్రమును గొట్టెను. ద్రౌపది పాండవు లయిదుగురికిని భార్య యయ్యెను. పాండవులకు
ధృతరాష్ట్రు డర్థరాజ్యము నిచ్చెను. శ్రీకృష్ణు డర్జుననిచే ఖాండవ వనము దహింపజేసెను. అప్పుడే అగ్నివలన అర్జునునకు గాండీవ మను విల్లును, రథమునులభించెను.ధర్మరాజు సోదరుల సహాయముతో నలుదిక్కుల రాజులను గెలిచి రాజసూయము మహావైభవముగా జేసెను. అది చూచిన దుర్యోధనునకు కన్నుకుట్టెను. అతడు శకుని, కర్ణ, దుశ్శాసనుల ప్రోత్సాహముతో ధర్మరాజును బిలిచి, శకునితో మాయజూద మాడించి రాజ్యమును నపహరించి పాండవులను పండ్రెండేండ్లు వనవాసమును, ఒక యేడు అజ్ఞాతవాసమును చేయుటకు అడవులకుబంపెను. ధర్మరాజుసోదరులతోను,ద్రౌపదితోను ద్వాదశవర్షములు అరణ్యవాసము చేసి, పదమూడవ యేట అజ్ఞాతవాసము చేయుటకు విరాటనగరమునకు వెళ్ళెను. ధర్మరాజు తాను కంకుభట్టయ్యెను. భీముడు వంటలవాడయ్యెను. అర్జునుడు బృహన్నల యయ్యెను. నకుల సహదేవులు అశ్వగోపాలకులైరి. ద్రౌపది సైరంధ్రిగా విరటుని భార్య సుధేష్ణ దగ్గర చేరెను.అక్కడ కీచకు డను వాడు ద్రౌపదిని కామించి
వేధించుచుండగాభీముడొకనాటిరాత్రివానినిగుట్టురట్టుకాకుండమట్టుబెట్టెను.

అజ్ఞాతవాసము పూర్తియగు సమయమున కౌరవులు విరాటుని గోవులను అపహరింపబోయిరి. అర్జునుడు వానిని విడిపించుటకు వెళ్ళి బయటపడెను. పాండవు లింద్రప్రస్థమున ఉన్నప్పుడే అర్జునునికి కృష్ణుని చెల్లెలైన సుభద్రతో పెండ్లియయ్యెను. వారికి అభిమన్యుడను కుమారుడు పుట్టెను. అజ్ఞాతవాసానంతరము పాండవులను గుర్తించిన విరాటుడు తన కుమార్తె ఉత్తరను అభిమన్యున కిచ్చి వివాహము చేసెను.కృష్ణుడు పాండవుల దూతగా కౌరవ సభకు వెళ్ళి, ధర్మరాజాదులకు వారి అర్థరాజ్యము వారి కిమ్మనెను. లేదా, ఐదుగురికి ఐదూళ్ళైనను ఇమ్మనెను. దుర్యోధనుడు సూదిమొన మోపినంత భూమికూడ పాండవుల కియ్యననెను. ఐనచో యుద్ధము తప్పదని శ్రీకృష్ణుడు పలుకగా వాడు కృష్ణుని బంధింపబోయెను. అతడు విశ్వరూపము చూపి వారిని నిస్తేజులను చేసెను. తరువాత విదురుని యింట భోజనము చేసి, ధర్మరాజు నొద్దకు వచ్చి, "కౌరవులతో యుద్ధము తప్పదు. సన్నాహములు చేయు"డనిచెప్పెను. యుధిష్ఠిరుని వైపు ఏ డక్షౌహిణుల సేన సమకూరెను. కౌరవుల వైపు పదునొకం డక్షౌహిణుల సేన సిద్ధమయ్యెను.యుద్ధమునకు రెండు సేనలును కురుక్షేత్రమునకు చేరినవి. అర్జునుడు భీష్మద్రోణాదులను, ఇతర బంధువులను చూచి, తాను యుద్ధము చేయ ననెను. శ్రీకృష్ణుడు, "శరీరములు నశించును. ఆత్మ నశింపదు. ఆత్మయే పరబ్రహ్మము. ఆ పరబ్రహ్మమే నేను. అది గ్రహించి జయాపజయములను సమముగా భావించి యోగివై రాజధర్మమును పాలింపు"మని బోధించి యుద్ధమునకు ఉన్ముఖుని జేసెను. కౌరవ సౌన్యములకు సేనాపతి భీష్ముడు, కౌరవులు, పాండవులు జయాభిలాషతో పోరాడిరి. పాండవ పక్షమున శిఖండి సేనాపతి. పదిరోజుల యుద్ధములో, పదవనాడు శిఖండి భీష్ముని పడగొట్టెను.స్వచ్ఛంద మరణము వరముగా పొందిన భీష్ముడు శరతల్పగతుడై, ఉత్తరాయణము కొరకెదురు చూచుచుండెను. తరువాత కౌరవ సేనకు ద్రోణుడు సేనాపతి యయ్యెను. విరాటుడు ద్రుపదుడు కౌరవ
ననకు ద్రోణుడు సేనాపతి యయ్యెను. విరాటుడు ద్రుపదుడు మున్నగువారు
ద్రోణసాగరములో మునిగిపోయిరి. ధృష్టద్యుమ్నుడు విజృంభించెను.
అశ్వత్థామ చచ్చెనని విని ద్రోణుడు శస్త్రాస్త్రములను విడిచెను. ధృష్టద్యుమ్నుడాతనిని బాణములతో గొట్టి చంపెను. తరువాత కౌరవసేనకు కర్ణుడు సేనాని మయ్యెను. పాండవులకును కర్ణునికిని ఘోరసంగ్రామ మయ్యెను. రెండవ రోజున ద్వంద్వయుద్ధములో అర్జునుడు కర్ణుని జంపెను. తరువాత శల్యుడు ఒకనాడు
సేనాపతియై యుద్ధము చేయగా ధర్మరాజాతనిని వధించెను.

దుర్యోధనుని తమ్ముల నందరను పదునెనిమిదవ రోజు యుద్ధములో భీముడు చంపివేసెను. తరువాత గదాయుద్ధములో దుర్యోధనుని గూడ చంపివేసెను. ఆ రాత్రి కృప కృతవర్మలతో గలిసి అశ్వత్థామ పాండవశిబిరములో అందరును నిద్రించుచుండగా, ఉపపాండవులను, ధృష్టద్యుమ్నుని, గజతురగ సైన్యములను నిర్దాక్షిణ్యముగా చంపివేసెను. అర్జునుడు అశ్వత్థామను బట్టుకొని ద్రౌపది దగ్గర కీడ్చుకొని వచ్చెను. ఆమె పుత్రశోకముతో ఉండికూడ, తన పుత్రులను జంపిన అశ్వత్థామను విడిపించెను. అర్జును డతని శిరోమణిని గ్రహించి విడిచిపెట్టెను. అశ్వత్థామ అస్త్రముతో ఉత్తరాగర్భములో చనిపోయిన పరీక్షిత్తును శ్రీకృష్ణుడు తిరిగి బ్రతికించెను.

భారత యుద్ధములో చనిపోక బ్రతికినవారు, కౌరవపక్షములో అశ్వత్థామ కృప కృతవర్మలు. పాండవ పక్షములో పాండవులు, సాత్యకి, కృష్ణుడు. ధర్మరాజు, చనిపోయిన బంధువులకు ఉత్తర క్రియలు చేసెను. భీష్ముని వలన అనేక ధర్మములు దెలిసికొనెను. తరువాత అశ్వమేధయాగము చేసెను. ద్వారకలో యాదవ వంశక్షయమును అర్జునుని ద్వారా విని చాల విచారించి, రాజ్యమును పరీక్షిత్తునకు ఇచ్చి భార్య ద్రౌపదితోను, తమ్ములతోను స్వర్గమునకు మహాప్రస్థానము చేసెను. ద్రౌపదియు భీమార్జున నకులసహదేవులును దారిమధ్యలో పడి మరణించిరి. ఇంద్రుడు పంపిన విమానము మీద మానవదేహముతోనే ఎక్కి ధర్మరాజును, తేజోమయ దేహముతో ద్రౌపదీ భీమార్జున నకుల సహదేవులును స్వర్గము నలంకరించిరి.

## దేవాలయ నిర్మాణము - దాని పుణ్యము

ఏ దేవుని కైనను ఆలయమును నిర్మించినచో కలిగెడి పుణ్యము ఇంతంత అని చెప్పలేము. దేవాలయ నిర్మాతలను గూర్చి యముడు తన భటులతో ఇట్లు పలికెను. "కింకరులారా!ప్రతిమా (విగ్రహ) పూజలు చేయువారిని నరకమునకు దెచ్చు ప్రయత్నము చేయకుడు. అట్లే దేవాలయమును నిర్మించిన వారి జోలికి గూడ వెళ్ళకుడు. మంచి చెడ్డలు విచారించి ప్రవర్తింపుడు. జగద్రక్షకుడైన జనార్దనుని ఆశ్రయించిన వారిని జూచి మీరు దూరము నుండియే తొలగిపొండు. వారికి నరక లోక బాధలు ఉండవు కనుక మీరు వారివైపు చూడనక్కర లేదు. ఎవ్వరు గోవిందనామ స్మరణము చేయుచుందురో వారిని విడిచి దూరముగా నుండుడు. శ్రీకృష్ణ భగవానుని ధూపదీప నైవేద్యాదులతో అర్చన చేయువారి యొద్దకు వెళ్ళవలదు. ఆలయమును తుడిచి, నీళ్ళు చల్లి ముగ్గులు పెట్టువారు మహాపుణ్యాత్ములు. వారి జోలికి పోవద్దు. ఆలయ నిర్మాణము చేసిన యజమానియే కాదు.

దాని నిర్మాణములో పనిచేసిన శిల్పులు కార్మికులు గూడ పుణ్యాత్ములే. మీరు వారి వైపునకు గూడ కన్నెత్తి చూడవలదు. ఇది నా యాజ్ఞ". అందుచేత ఒక దేవమందిరమును శిలలతో గాని, ఇటుకలతోగాని, కొయ్యతోగాని, కనీసము మట్టితోగాని నిర్మించినచో, సర్వపాప విముక్తుడై ప్రతిదినము యజ్ఞము చేసినంత ఫలమును బొందును. దేవాలయము నందలి యిటుకల నిర్మాణ మెన్ని సంవత్సరములు నిలిచియుండునో అన్ని వేలేండ్లు నిర్మాత స్వర్గలోకములో నుండును. విగ్రహనిర్మాత విష్ణులోకమును బొందును. ప్రతిష్ఠ చేసినవారు విష్ణు సాయుజ్యమును బొందుదురు. ఆలయము శిథిల మైనప్పుడు జీర్ణోద్ధరణము చేసినవారుగూడ ఇట్టి ఫలములనే పొందుదుర.

దగ్ధయోగములు

1. ద్వాదశీ భాను (ఆది) వారము దగ్ధయోగము.
2. ఏకాదశీ సోమవారము గూడ దగ్ధయోగము.
3. దశమీ మంగళవారము,
4. తదియా బుధవారము,
5. షష్ఠీ గురువారము,
6. విదియా శుక్రవారములు దగ్ధయోగములుగా చెప్పబడినవి. ఈ యోగములలో ఏ పని ప్రారంభించినను అది కొనసాగదు. సప్తమీ ఆదివారమును, విదియా ఆదివారమును, ద్వాదశీ మంగళవారమును, సప్తమీ తృతీయ (తదియ)లతో గూడిన శనివారమును త్రిపుష్కరము లనబడును. ఈ దినములలో లాభము, విజయము, వృద్ధి, పుత్రజన్మము, నష్టము, భ్రష్టత్వము, నాశనము ఏది జరిగినను అది త్రిగుణముగా (మూడురెట్లు) ఉండును.

## నవతారలు - వాని ఫలములు

జన్మనక్షత్రమునుగాని, నామనక్షత్రమును గాని స్పుటముగా నిర్ణయించుకొని, దాని నుండి లెక్కపెట్టినచో 1.జన్మతార 2.సంపత్తార 3.విపత్తార 4.క్షేమతార 5.ప్రత్య(రా)క్తార 6.సాధనతార 7.నైధనతార 8.మిత్రతార 9.పరమమిత్రతార వచ్చును. నక్షత్రములు 27. తారలు తొమ్మిది. 27/9 ౹3 నవకములు. ప్రతి నవకము (9) లోను తారల పేర్లు అవే. ఇంక వీని ఫలములు -

1. జన్మతార అన్నింటికిని మంచిదికాదు.
2. సంపత్తార అన్నింటికిని చాలశ్రేష్ఠము.
3. విపత్తార మంచి ఫలముల నీయదు.

4. క్షేమతార సర్వకార్యములందును మేలు కలిగించును.

5. ప్రత్య క్తార ధననాశనము చేయును.

6. (సా)ధన తార రాజ్యాదిలాభములను గలిగించును.

7. నైధనతార సర్వకార్యములను నాశనము చేయును.

8. మిత్రతార అన్ని పనులందును అనుకూల్యము గలిగించును. మైత్రిని పెంచును.

9. పరమమిత్రతార అన్నికార్యములందును జయము గలిగించి హితము చేకూర్చును.

60 సంవత్సరములు - వాని ఫలములు

ప్రభవాది షష్టి (60) సంవత్సరములకును ఫలము లిట్లుండును :

1. ప్రభవ యజ్ఞములు విరివిగా జరుగును.

2. విభవ జనులు సుఖముగా నుందురు.

3. శుక్ల : సర్వసస్యములు సమృద్ధిగా పండును.

4. ప్రమోద : అందరకును ఆనందము నిచ్చును.

5. ప్రజాపతి : అన్నిటిలో అభివృద్ధి కనిపించును.

6. అంగీరస : భోగములు కలిగించును.

7. శ్రీముఖ : లోకము సంపదలతో వృద్ధినొందును.

8. భావ : ఉన్నత భావములు కలిగించును.

9. యువ : ఇంద్రుడు వర్షములు గురిపించి, భూమిని సస్యపూర్ణము చేయును.

10. ధాత : అన్ని ఓషధులును (మొక్కధాన్యాలు) ఫలించును.

11. ఈశ్వర : క్షేమము - ఆరోగ్యము నిచ్చును.

12. బహుధాన్య : దేశము సుభిక్షముగా నుండును.

13. ప్రమాథి

(స్వభాను, సుభాను) : వర్షములు మధ్యస్థముగా నుండును.

14. విక్రమ : సస్యములు సంపదలు వృద్ధిచేయును.

15. వృష : వర్షము లన్నిచోట్ల బాగుగా కురియును.

16. చిత్రభాను : చిత్రవిచిత్రాలంకారము లిచ్చును.

17. స్వర్భాను : క్షేమమును ఆరోగ్యమును గలిగించును.

18. తారణ : మేఘములు సస్యానుకూలముగా వర్షించి శుభములు గలిగించును.

19. పార్థివ : సస్యసంపదలు వృద్ధియగును.

20. (జయ) వ్యయ : అతివృష్టి కలుగను.

21. సర్వజిత్తు : ప్రజలు సుఖించునట్లు వర్షము లిచ్చును.

22. సర్వధారి : సుభిక్షముగా నుండును.

23. విరోధి : మేఘములను హరించి అనావృష్టి కలిగించును.

24. వికృత (వికృతి) : భయంకరముగా నుండును.

25. ఖర : పురుషులు వీరులగుదురు.

26. నందన : ప్రజలానందముతో నుందురు.

27. విషయ (విజయ) : శత్రువులను సంహరించును.

28. జయ : శత్రువుల పైనను, రోగముల పైనను జయము కలిగించును.

29. మన్మథ : జ్వరాది బాధలు కలిగించును.

30. దుర్ముఖ (దుష్కర) : ప్రజలు దుష్కర్మములు చేయువా రగుదురు.

31. హేమలంబ : సంపదలు గల్గును.

32. విలంబ (బి) : సుభిక్షముగా నుండును.

33. వికారి : శత్రువులకు కోపము గలిగించును.

34. శార్వరి : అక్కడక్కడ సస్యములు ఫలించును.

35. ప్లవ : నీళ్ళు సమృద్ధిగా ప్రవహించును.

36. శుభకృత్తు : ప్రజలు శుభములతో ఉందురు.

37. శోభకృత్తు : ప్రజలు శుభములతో నుందురు.

38. క్రోధి : కోప స్వభావము పెరుగును.

39. విశ్వావసు : ధన సమృద్ధి గలుగును.

40. పరాభవ : ప్రజలు ఒకరినొకరు అవమానించు కొందురు.

41. ప్లవంగ : జల సమృద్ధి గలుగును.

42. కీలక : సస్య సమృద్ధి కలుగును.

43. సౌమ్య : శుభములు గలుగును.

44. సాధారణ : సామాన్య శుభములు గలుగును.

45. విరోధికృత్తు : జనులలో విరోధములు దెచ్చును.

46. పరీధావి : భీతిని గలిగించును.

47. ప్రమాది : ప్రమాదములు ఎక్కువ.

48. ఆనంద : సంతోషకరముగా నుండును.

49. రాక్షస : ప్రజలు కఠిన హృదయులై యుందురు.

53. సిద్ధార్థ : సర్వ కార్యములు సిద్ధించును.

54. రౌద్ర : ప్రజలకు బాధాకరముగా నుండును.

55. దుర్మతి : వర్షము సామాన్యముగా నుండును.

56. దుందుభి : క్షేమమును, ధాన్యములను ఇచ్చును.

57. రుధిరోద్గారి : రక్తధారలు ప్రవహించును.

58. రక్తాక్ష : రక్తధారలు ప్రవహించును.

59. క్రోధన : జయము గలిగించును.

60. క్షయ : లోకమున ధనము క్షీణించును.

## ఆచారములు

మానవుడు ప్రతి దినము ఆచరింపవలసిన కర్మములనే ఆచారము(లు) అందురు. బ్రాహ్మముహూర్తమున అనగా తెల్లవారు జామున నాలుగు గంటలకు లేచి దైవప్రార్థన చేయవలెను. పగటివేళ ఉత్తరముఖముగా కూర్చుండి మలమూత్రవిసర్జనము చేయవలెను. రాత్రి యందు దక్షిణ ముఖుడై చేయవలెను. సంధ్యాకాలములందు ఉత్తర ముఖుడై చేయవలెను. అవి కూడ దారిలోగాని నీటిలోగాని చేయరాదు. గడ్డి మొలచిన చోట విసర్జనము చేయవలెను. కాలకృత్యములు దీర్చుకొని దంతధావనము చేయవలెను.తరువాత స్నానము చేయవలెను. స్నానము చేయకుండ చేసిన పూజా వ్రతాదు లేవియు ఫలముల నియ్యవు. స్నానమునకు నూతినీళ్ళు, నదినీళ్ళు, సరస్సులలోని నీళ్ళు మంచివి. పుణ్యతీర్థోదకములు, గంగా జలములు మరింత మంచివి. స్నానము చేసిన తరువాత అంతశ్శుద్ధి కొఱకు ఆచమనము చేయవలెను. బ్రాహ్మణు లైనచో అఘమర్షణ సూక్తములు జపించవలెను. పురుష సూక్తముకూడ జపించ వచ్చును. ఉత్తరీయమును పిండుకొని దేవతా పితృతర్పణము చేయవలెను. బట్టలు పిండుకొన్న తరువాత సంధ్య వార్చవలెను. తరువాత అగ్నిలోహోమములు చేయవలెను.స్నానాంతరము దైవధ్యానము చేసి, పిదప దైవదర్శనము చేయవలెను. బరువు మోయువానికిని, గురువులకును, గర్భిణీ స్త్రీలకును ప్రక్కకు తొలగి దారి యియ్యవలెను. సూర్యుని ఉదయించునప్పుడును అస్తమించునపుడును చూడరాదు. (అల్ట్రా వయొలెట్ కిరణములు మన కన్నులకు హానిచేయును) నీళ్ళలో గూడ సూర్యబింబమును చూడరాదు. నగ్నముగా నున్న స్త్రీని చూడరాదు. నూతిలో (నీటిలో) తన నీడ చూచుకొనరాదు. వధ్యస్థానమును చూడరాదు. పాపాత్ముని చూడరాదు.ప్రత్తిని, ఎముకను, భస్మమును దాటరాదు.

ఎంతో అవసరమైనప్పుడు గాని ఇతరులకు దూతగా వెళ్ళరాదు. విషయముగా నున్న చెట్లు, కొండలు ఎక్కరాదు. చిల్లులున్న నావ నెక్కరాదు. నోటితో ఈల వేయరాదు. దీపము లేకుండ రాత్రివేళ ప్రయాణించరాదు. సింహద్వారము గుండా ఇంటిలో ప్రవేశించవలెను గాని గోడలు దూకి కాదు. కట్టిన బట్టను తిరగవేసి మరల కట్టుకొనరాదు. ఎప్పుడును శుభమునే పలుకవలెను. అశుభము పలుకరాదు. పెద్దవారి మధ్యనుండి వెళ్ళరాదు. రెండు చేతులతో బుర్ర గోకికొనరాదు. నీళ్ళలో మలమూత్రములు విడువరాదు. నదులలోగాని జలాశయములలోగాని నగ్నముగా స్నానము చేయరాదు. "నాప్సు మూత్రపురీషం కుర్యాత్।నవివసనఃస్నాయత్"అనివేదము కూడచెప్పను.దుష్ట వర్తనము గలవారి ప్రక్క నివసింపరాదు. వైద్యుడు లేనిచోట, రాజు (పాలన) లేనిచోట, నది లేనిచోట, దుష్ట స్త్రీలున్నచోట నివసింపరాదు. నవ్వినను, తుమ్మినను, ఆవులించినను నోటిని మూసికొనవలెను. తనకుగాని, తన యజమానికి గాని జరిగిన అవమానమును చెప్పుకోరాదు.రోగ మెంత చిన్న దైనను నిర్లక్ష్యము చేయరాదు. ప్రత్యక్షముగాగాని పరోక్షముగా గాని ఎవ్వరికిని అప్రియము పలుకరాదు. నిందింపరాదు కూడ.వేదశాస్త్రములను, దేవతలను నిందించువారి ప్రక్కన గూడ నిలువరాదు. ధర్మము నాదరించ వలెను. దేవపూజలు చేయుచుండవలెను. పుట్టినరోజునాడు దేవపూజ చేసి దానధర్మములుచేయవలెను.షష్ఠినాడు,చతుర్దశినాడు(నరకచతుర్దశితప్ప),అష్టమినాడు, అమావాస్యనాడు అభ్యంగన స్నానము చేయరాదు.పెద్దవారితో ఎప్పుడును విరోధము పెట్టుకొనరాదు. స్త్రీలతోగూడ కలహము పెట్టుకొనరాదు.

నవగ్రహ యజ్ఞము

ప్రజలయొక్కయు,రాజులయొక్కయుపతనములుగాని,ఔన్నత్యములుగాని,గౌరవా గౌరవములు గాని,గ్రహముల సంచారమువలననేయేర్పడునుగాన నవగ్రహములు నెప్పుడును ఆరాధింపవలెనని బ్రహ్మదేవుడు చెప్పెను. ఎప్పుడే గ్రహము వలన మనకు పీడ కలుగునో ఆ గ్రహమునకు శాంతి చేయవలెను.సంపదలు, శాంతి, వర్షము, ఆయువు, అభివృద్ధి, ఆరోగ్యము కోరు ప్రజలు నవగ్రహ యజ్ఞము చేయవలెను. సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని, రాహువు, కేతువు అని గ్రహములుతొమ్మిది.

# అగ్ని పురాణము

| గ్రహములు | విగ్రహములు | సమిధులు | నైవేద్యము | దానములు ధాన్యము ఇతరములు |
|---|---|---|---|---|
| 1. సూర్యుడు | రాగితో | జిల్లేడు | గుడౌదనం | గోధుమలు ధేనువు |
| 2. చంద్రుడు | స్ఫటికముతో | మోదుగు | పాయసము | బియ్యము శంఖము |
| 3. కుజుడు | ఎర్రచందనపుకర్రతో | చంద్ర | హవిస్సు | కందులు ఎద్దు |
| 4. బుధుడు | బంగారముతో | ఉత్తరేణి | క్షీరయష్టికము పాలమిగడ | పెసలు బంగారము |
| 5. గురుడు | స్ఫటికముతో | రావి | ధధ్యోదనము | సెనగలు వస్త్రము |
| 6. శుక్రుడు | వెండితో | మేడి | హవిస్సు | బొబ్బర్లు గుఱ్ఱము |
| 7. శని | ఇనుముతో | జమ్మి | అప్పాలు | నువ్వులు కపిలగోవు నల్లని ఆవు |
| 8. రాహువు | సీసము | గరికగడ్డి | మినపగారెలు | మినువులు ఇనుము |
| 9. కేతువు | సీసము | దర్భలు | పులిహోర | ఉలవలు మేకపోతు |

ఈ నవగ్రహములకును వేర్వేరుగా మండలములు నిర్ణయింపబడినవి. వీనిని రంగులతో గాని, గంధముతోగాని వేసి, వానిపై ఆయా గ్రహములకు చెప్పబడిన రంగు బట్టలను పఱచి వానిపై విగ్రహములుంచి పూజించవలెను.

| గ్రహములు | మండలములు | వస్త్రములు |
|---|---|---|
| 1. సూర్యుడు | గుండ్రనిది | ఎఱ్ఱనిది |
| 2. చంద్రుడు | చతురస్రము | తెల్లనిది |
| 3. అంగారకుడు | త్రికోణము | ముదురుఎరుపు |
| 4. బుధుడు | బాణాకారాము | ఆకిపచ్చనిది |
| 5. గురుడు | దీర్ఘచతురస్రము | పసుపురంగు |
| 6. శుక్రుడు | పంచకోణము | లేతబంగారు రంగు |
| 7. శని | ధనురాకారము | నలుపు రంగు |
| 8. రాహువు | చేటరూపము | నలుపు రంగు |
| 9. కేతువు | జెండా | చిత్రమైన పువ్వులు గలది |

ఈ నవగ్రహములను ఆయా మంత్రములతో మండలములపై ఆవాహనము చేసి పూజించి పంచామృతములతో అభిషేకించవలెను. పైన చెప్పబడిన నైవేద్యములు, తాంబూలాది ఉపచారములు అర్పించి, తరువాత అగ్ని ప్రతిష్ఠాపనము చేసి పైన చెప్పబడిన సమిధలతో 108 సార్లుగాని 28సార్లుగాని యథాశక్తిగా హోమము చేసి ఆయా గ్రహములకు నిర్ణయింపబడిన ధాన్యములను, వస్తువులను దానములుగా ఇచ్చి, ధనములను దక్షిణలుగా ఇయ్యవలెను. ఇట్లు నవగ్రహ యజ్ఞము చేసినచో వారు సంతుష్టులై, చేసిన యజమానులకు కోరిన వరము లిచ్చెదరు.

నాడీచక్రము

నాడీ చక్రము నెరింగినవారు ప్రాణస్వరూపమును, తద్ద్వారా హృదయాంతర్గతుడైన పరమాత్మ స్వరూపమును గ్రహింపగలరు.నాభికి క్రిందుగా నాడుల మాలకందము ఉండును. అక్కడినుండియే నాడుల ప్రారంభము. నాభిమధ్యమున 72000 నాడులుండును. ఈ శరీరమంతయు, నిలువుగాను, అడ్డముగాను, ఊర్ధ్వముగాను వ్యాపించిన నాడులతో నిండియుండును. వీనిమధ్య ప్రధాన నాడులు పది యున్నవి. ఇడ, పింగళ, సుషుమ్న, గాంధారి, హస్తిజిహ్వ, పృథ, యశ, ఆలంబుస, హుహు, శంఖిని అని వాని పేరులు. వాయువులు గూడ పది. ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము;నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము అని వాని నామములు. ఈ పదివాయువులలో ప్రాణము మొదటిదియు ప్రధానమైనదియు అయి యున్నది. ప్రాణవాయువు ప్రాణమును నిలబెట్టుచున్నది. హృదయ స్థానమున నుండి, ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములతో జీవనాధారమై యుండును. జీవిని ఇట్లు లోకములో ప్రయాణము చేయించుచున్నది కనుకనే ప్రాణమనబడును. తిన్న ఆహారమును జీర్ణము చేసి మలమూత్ర శుక్ర రూపములో క్రిందికి త్రోయునది అపానవాయువు. త్రాగిన వానిని, తిన్నవానిని రక్తముగా, పిత్తముగా, శ్లేష్మముగా, వాయువుగా (వాతముగా) మార్చి, శరీరమునకు సమానముగా అందజేయునది సమానవాయువు.కంఠ ప్రదేశమున నుండి ముఖమును, పెదవులను, కన్నులను అదురునట్లు చేయుచు కామక్రోధాదులను ఉత్తేజ పరచునది ఉదానవాయువు. శరీరమును ఎటు కావలసిన అటు వంగునట్లు (కదలునట్లు) చేయుచు, కంఠముదాక వ్యాపించియుండి, ఆహార విహారాదులలో ఏమాత్రము తేడా వచ్చినను వ్యాధులు గలిగించునది వ్యానవాయువు. వమనము కలిగించునది నాగవాయువు.కన్నులు తెరచునట్లు చేయునది కూర్మవాయువు.

మ్రింగుటలో సహాయపడునది కృకరవాయువు. ఇంద్రియములు విజృంభించునట్లు చేయునది దేవదత్తవాయువు. ప్రాణఘోషయందు నిలుచుచు, ప్రాణము పోయినను శరీరమును దహనమగు వరకును అంటిపెట్టుకొని యుండునది ధనంజయవాయువు. (చెవులలో వ్రేళ్ళు పెట్టుకొన్నచో గుంయి మను శబ్దము వినబడును. అదే ప్రాణఘోషము). సుషుమ్నవాడి శరీరమధ్యమున (వెన్నెముకలో) ఉండును. ఇడానాడి యెడమ భాగములోను, పింగళానాడి కుడి భాగములోను ఉండును. గాలిని పీల్చి పొట్ట నుబ్బించుటనే ప్రాణాయామ మందురు. ఇడానాడి ద్వారా గాలిని లోనికి పీల్చుట పూరక మనబడును.ఆ గాలిని శక్తిమేరకు లోపల బంధించుట కుంభక మనబడును. పింగళానాడి ద్వారా గాలిని విడుచుట రేచక మనబడును. ఇది ఒక ప్రాణాయాయ విధానము. ప్రాణాయామము చేయపోయినను మనము నిత్యము గాలిని పీల్చి వదలుచునే యుందుము. గాలిని పీల్చునప్పుడు 'సో'అను శబ్దము వచ్చును. విడుచుచున్నప్పుడు 'హం'అను శబ్దము వచ్చును. "సోహం"అనుదానికి "ఆ పరమాత్ముడనే నేను"అని యర్థము. అనగా మనము తెలిసియో తెలియకయో పరమాత్మని నిత్యము స్మరించు చున్నా మన్నమాట. "సోహం"అన్నదానిని తిరుగవేసిన "హంసః"అగును. హంస యనగా పరమాత్మ. లేదా పరమాత్మ స్వరూపమైన ప్రాణము. దీనినే హంసగాయత్రి అందురు. గాయత్రి యనగా ప్రాణములను రక్షించునది అని యర్థము. ఈ పరమార్థమును గ్రహించి (తెలిసికొని) ఎవ్వరీ హంస గాయత్రిని జపింతురో వారికి పునర్జన్మము ఉండదు. "హంస హంసేతి యోబ్రూయా ద్ధంసో దేవ స్సదాశివః".
దీనినే అజపాగాయత్రి అనికూడ చెప్పుదురు.

ప్రణవము (ఓంకారము)

వేదములు ప్రణవముతో మొదలై ప్రణవముతో ముగియును. ప్రణవము సర్వ వాఙ్మయ రూపము. కావున ప్రణవము నభ్యసింపవలెను. అకారము ॽ ఉకారము మకారములోని అర్థమాత్రయు గలిసి "ఓమ్"అను ప్రణవ స్వరూప మేర్పడినది. అకార, ఉకార, మకారములు మూడును, మూడు వేదములు, మూడు లోకములు (భూః - భువః - సువః), 'బ్రహ్మవిష్ణు శంకరులు, సత్త్వరజస్తమో గుణములు, జాగ్రత్ స్వప్న సుషుప్తులు, ప్రద్యుమ్న - శ్రీ (లక్ష్మి) - వాసుదేవు లనెడి అర్చామూర్తులు అని భావింపబడుచున్నవి. ఇట్టి ఓంకార స్వరూపమును దెలిసికొన్నవాడే ముని, తురీయ (4వ) మాత్ర గాంధారి యనబడుచు, శిరస్థానమున నుండును.

# అగ్ని పురాణము

అది ఘటము నందలి దీపమువలె దేహమధ్యమున హృదయపద్మములో పరబ్రహ్మ జ్యోతి రూపమున ప్రకాశించుచుండును. దానిని నిత్యము జపించుచు ధ్యానించవలెను. ప్రణవము ధనుస్సు. ఆత్మయే బాణము. లక్ష్యము పరబ్రహ్మము. ఉపాసకుడు జాగ్రత్త గలిగినవాడై లక్ష్యమును కొట్టవలెను. కొట్టినచో జీవాత్మ పరమాత్మ దగ్గరకు చేరుటే కాదు;పరమాత్మలో లయ మగును. మొదటనే, నామరూపరహితమైన పరబ్రహ్మమును ధ్యానించుటచసాధ్యము కాదు. అందుకే విగ్రహారాధన. ఆరూపము మనసులో హత్తుకొన్న తరువాతక్రమముగాజ్ఞానసిద్ధికలుగును.ఆ పైన నిర్గుణ బ్రహ్మోపాసనము సాధ్య మగును. ప్రణవ స్వరూపమైన ఈ ఒక్క అక్షరమే బ్రహ్మము. అదే సర్వశ్రేష్ఠము. అదే అందరకును గమ్యస్థానము. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ"

ఇది అగ్నిపురాణము

---